

# అనీసూర్

ఒకప్పుడు బస్రానగరానికి మహమ్మద్ ఇబన్ సులేమాన్ సుల్తానుగా ఉండేవాడు. బగ్దాద్‌లో ఉండే ఖలీఫా హారూన్ అల్‌రషీద్ కింద ఈయన సామంతరాజు. ఈ సుల్తాను వద్ద ఇద్దరు మంత్రులుండేవారు. వారిలో వజీర్ అల్ ఫదల్ అనేవాడు చాలా ఉత్తముడు; వజీర్ అల్ మూయిన్‌సావీ అనేవాడు చాలా చెడ్డవాడు. అందుచేత ప్రజలు అల్ ఫదల్ అంటే ఎంతో అభిమానంగా ఉండేవారు, సావీని చూసి భయపడేవారు.

ఇలా ఉండగా ఒకనాడు బస్రానగరానికి అన్నిదేశాలనుంచీ ఆడబానిసలు అమ్మకానికి వచ్చినట్టు సుల్తానుకు వార్త తెలిసింది. ఆయన అల్ ఫదల్‌ను పిలిచి, "బానిసలలో అపూర్వమైన సుందరి ఉన్నట్టయితే పదివేల దీనారాలదాకా ఖర్చుచేసి నాకు కొనిపెట్టు," అని ఆజ్ఞాపించాడు. అల్ ఫదల్ బానిస వర్తకులవద్దకు వెళ్ళి సుల్తానుగారు కోరినటువంటి బానిసకోసం విచారించాడు. వెయ్యి దీనారాలు మించిన ఖరీదుగల బానిసల నందరినీ స్వయంగా చూశాడు. కాని వారిలో ఒకతెకూడా అల్ ఫదల్‌కు నచ్చలేదు.

అదిమొదలు బానిసవర్తకులు రోజూ ఆయనకు అందగత్తెలను తెచ్చి చూపుతూ వచ్చారు. సుల్తాను ఆయనకుపెట్టిన గడువు ముప్పైరోజులు. ఈ గడువు పూర్తి అయింది. వజీరు వెయ్యిమంది బానిసలను స్వయంగా చూశాడు. కాని ప్రయోజనం లేకపోయింది.

గడువు పొడిగించమని సుల్తానును కోరుకుందామనే ఉద్దేశంతో అల్ ఫదల్ గుర్రం ఎక్కి తన ఇంటినుంచి బయలుదేరబోతుండగా ఒక వర్తకుడు వచ్చి, "అయ్యా, తాము కావాలన్న అపురూపసుందరి ఒకతె అమ్మకానికి వచ్చింది," అన్నాడు.

"అయితే ఆమెను వెంటపెట్టుకుని రా!" అంటూ అల్ ఫదల్ గుర్రం దిగి మళ్లీ లోప

ఎస్. ధర్మారావు





లికి వచ్చేశాడు. మరొక గంటలోపల వర్తకుడు ఒక బానిసపిల్లను తనవెంట తీసుకు వచ్చి పెద్దవజీరుకు చూపాడు. ఆమె నిజంగానే అద్భుత సౌందర్యవతి. ఆమె పేరు అనీస్ అల్‌జలీస్. అనీస్ అల్‌జలీస్ అనే మాటకు "ప్రియసఖి" అని అర్థం. ఆమె గొప్ప అందగత్తె కావటమేగాక బాగా చదువుకుని పాండిత్యంకూడా సంపాదించింది.

వజీర్ అల్‌ఫదల్ ఆమెను కొనటానికి నిశ్చయించుకుని, "ఈ బానిసకు పదివేల దీనారాలిస్తాను. ఈమెను నాకోసం కొనటం లేదు, సుల్తానుగారికోసం కొంటున్నాను. పదివేలవరకూ ఇవ్వటానికి నాకు అనుమతి ఉన్నది," అన్నాడు.

"సుల్తానుగారి కోసం అయినపక్షంలో నేను ఏమిచ్చినా పుచ్చుకుంటాను. కాని ఒక్క విషయం తమరు చిత్తగించాలి. ఈ పిల్ల చాలా దూరప్రయాణం చేసి బస్రాకు ఇవాళే చేరింది. అందుచేత గాలిమార్పు, నీటిమార్పు ఉంటుంది. పదిరోజులపాటు ఈమెకు విశ్రాంతి ఇచ్చి తరవాత సుల్తానువారికి వప్పగించమని నా సలహా!" అన్నాడు వర్తకుడు. అల్‌ఫదల్‌కు ఈ సలహా నచ్చింది. ఆయన ప్రియసఖిని తన భార్యకు వప్పగించి, "ఈ పిల్ల సుల్తానువారి దాసి. పదిరోజులపాటు మనఇంట ఉంటుంది. ఈ పదిరోజులూ ఇది మన అబ్బాయి అలీనూర్ కంటపడకుండా ఎలా చూస్తావో, జాగ్రత్త!" అని చెప్పాడు.

అల్‌ఫదల్ కొడుకు అలీనూర్ చాలా అందమైన యువకుడు. మంచివాడే గాని ఉద్రేకస్వభావం కలవాడు. ప్రియసఖిని వాడు చూశాడంటే తప్పక ప్రేమిస్తాడు. ఒక్కక్షణంలో దాన్ని తన వలలో వేసుకుంటాడుకూడా. సుల్తానుగారిదగ్గిర వజీర్ పరువు కాస్తా పోతుంది. ఈ సంగతులు వజీరు భార్యకు తెలుసు. అందుచేత ఆమె ప్రియసఖిని జనానా దాటి రానివ్వకుండా





వుంచుతూ వారం రోజులపాటు ఎంతో జాగ్రత్తగా కాపాడింది.

ఒకనాడు ఆవిడ స్నానశాలకు వెళ్ళివున్న సమయంలో అలీనూర్ జనానాలో ప్రవేశించి ప్రియసఖిని చూడనే చూశాడు. ఒకరినొకరు చూసుకున్న క్షణానే వారిద్దరిమధ్యా ప్రేమ కలిగింది. అతను ఆమెను ఒప్పించి తనతో బాటు బయలుదేరదీసుకుని, కొంతడబ్బు చేతబట్టుకుని వెళ్లిపోయి ఆమెను పెళ్లాడాడు.

తన కొడుకు చేసిన పనిచూసి అల్ ఫదల్ కుంగిపోయాడు. "నేను సుల్తానుగారివద్ద ఎంతో మర్యాద సంపాదించుకున్నాను. ఆయనకీ సంగతి తెలిస్తే నా పరువు పోతుంది. నేను నలుగురిలోనూ తల ఎత్తుకుని ఎలా తిరిగేది ?" అన్నాడాయన భార్యతో.

"ఇది సుల్తానుగారిదాకా వెళ్ళవలిసిన అవసరమేమున్నది ? మీ సొంత కుమారుడికి మీరు బానిసను కొనిపెట్టారనుకోండి, అది తప్పా ? కావలిస్తే సుల్తానుగారికి ఇంకొక బానిసను కొని ఇవ్వండి. లోకంలో ఇక అందగత్తెలే లేరా ?" అన్నది భార్య.

చేసేది లేదు గనక వజీరు అల్ ఫదల్ తన కొడుకు చేసిన తప్పు క్షమించ నిశ్చయించాడు. ఈ సంగతి తన తల్లిద్వారా రహస్యంగా తెలుసుకుని అలీనూర్ ప్రియసఖితోసహా ఇంటికి తిరిగి వచ్చాడు.



తన కొడుకూ ప్రియసఖీ ఎంత అన్యోన్యంగా ఉంటున్నారో చూశాక అల్ ఫదల్ మనసు కొంత కుదటబడింది. "అంతా అల్లా నిర్దేశం!" అనుకున్నాడాయన.

చిన్నవజీరు సావీ చాలా జిత్తులమారివాడు. వాడు జరిగినది పసిగట్టి సుల్తానుతో చెప్పి తనమీద ఫిర్యాదు చేస్తాడేమోనని అల్ ఫదల్ భయపడ్డాడు. సావీ కొంతవరకూ నిజం తెలుసుకున్నాడుకూడా; అయితే సుల్తాను గారు బానిసను కొనటం విషయం పూర్తిగా మరిచిపోవటంచేత, పెద్దవజీరుపైన ఫిర్యాదు చెయ్యటానికి ఆయనకు ధైర్యం చాలలేదు. కొద్దికాలం గడిచింది. పెద్దవజీరు అల్ ఫదల్‌కు జబ్బుచేసింది. ఆయన తన అవసాన కాలం సమీపించిందని తెలుసుకుని, తన కొడుకును పిలిచి అప్పగింతలు చెప్పి, కన్నుమూశాడు. ఆయన మరణానికి కంట తడిపెట్టనివారు బుస్రానగరంలో ఒక్కరు కూడా లేరు.

తండ్రిపోయాక అలీనూర్ దుఃఖసాగరంలో మునిగిపోయాడు. చాలారోజులు అతను బయటికి రాలేదు, ఎవరినీ చూడలేదు. చివరకు పెద్దవాళ్ళు అతన్ని మందలించి, "ఇలా విచారిస్తూ కూచుంటే లాభం లేదు. నీద్వారా నీ తండ్రి జీవించే ఉన్నాడు, గద!" అన్నారు.





ఈ సలహాతో అలీనూర్ మారిపోయాడు. అతను తన మిత్రులందరినీ ఆహ్వానించి ప్రతిరోజూ విందులు చేయసాగాడు. బస్రాలో ఉండే పెద్దవర్తకుల కొడుకులందరూ అతనికి మిత్రులే. వారు నిత్యమూ అలీనూర్ చుట్టూ చేరి అతనికి వినోదాలు కలిగిస్తూ, అతని ఖర్చుతో తాముకూడా సమస్త సౌఖ్యాలూ అనుభవించ సాగారు.

అలీనూర్ అమాయకుడు. స్నేహితులు ఏమి అడిగినా ఇచ్చేవాడు. "నూర్, ఫలాని చోట ఉన్న మీ తోటలాటిది నేనెక్కడా చూడలేదు!" అని స్నేహితుడెవడైనా అంటే చాలు, "అది నీదే! తీసుకో!" అనేవాడు.



డబ్బు మంచినీరులాగా ఖర్చయిపోయింది. ఇళ్ళూ, తోటలూ విచక్షణ లేకుండా తన స్నేహితులకు ఇచ్చేసి కొద్దికాలంలోనే అలీనూర్ దివాలా తీశాడు.

"ముందూ వెనకా చూడకుండా ఎందుకిలా ఖర్చు చేస్తారు. వీరంతా నిజంగా మీ స్నేహితులనే మీరు నమ్ముతున్నారా?" అని ప్రియసఖి ఎన్నిసార్లో తన యజమానిని హెచ్చరించింది. కాని ఆమె చేసిన హెచ్చరికలు అతని చెవికెక్కలేదు. తన సొత్తంతా పూర్తిగా తరిగిపోయేదాకా అతను ప్రియసఖిని గురించి ఆలోచించనుకూడా లేదు.

ఆఖరుకు స్నేహితులు మాయమయారు.

"మీదగ్గిర సొమ్ము ఉన్నంతకాలమూ ఈగలు ముసిరినట్టు ముసిరారు. ఇప్పుడు ఒక్క స్నేహితుడూ ముఖం చూపించడు!" అన్నది ప్రియసఖి.

"నా స్నేహితులను గురించి నువు అపోహపడుతున్నావు. నేను పూర్తిగా కింద పడిపోయినా నన్ను మళ్ళీ వాళ్ళు లేవనెత్తగల సమర్థులు! వారేవో పనులమీద ఉండి ఉంటారు. నా అవసరం గనక నేనే వారి వద్దకు పోతాను. వారు నన్నెలా ఆదుకుంటారో నువేచూస్తావు!" అంటూ అలీనూర్ మంచి దుస్తులు వేసుకుని వర్తకుల వీధికి వెళ్ళి





మొదటి స్నేహితుడి ఇల్లు చేరుకుని తాను వచ్చినట్టు లోపలికి కబురు పంపాడు.

ఆ స్నేహితుడు అలీనూర్‌ను చూడటం ఇష్టంలేక నౌకరుద్వారా తాను ఇంట లేనట్టు చెప్పించాడు.

"దొంగవెధవ, మొహం తప్పించాడు. కాని మిగిలినవాళ్ళు ఇంత నీచులు కారు!" అనుకున్నాడు అలీనూర్.

కాని ఒక్కరూ అతనిని ఆదుకోలేదు. చిన్నబోయిన ముఖంతో అలీనూర్ తన ఇంటికి తిరిగి వచ్చాడు. జరిగిన సంగతి విని ప్రియసఖి, "నేను చెప్పలేదా?" అన్నది.

తరవాత వారు తమ ఇంట్లో ఉన్న సామగ్రి క్రమంగా అమ్మి ఆ వచ్చిన డబ్బు ఖర్చు పెట్టేసుకున్నారు. ఆ డబ్బుకూడా అయిపోయాక అలీనూర్ విచారంలో మునిగిపోయాడు. అతనికిక బతికే దారి కనబడలేదు.

ప్రియసఖి కన్నీరు కార్చుతూ అతనితో, "సమస్తమూ పోయిందన్న విచారం మీ కెందుకు? మీకు నేనింకా ఉన్నానుగదా! ఒకప్పుడు నన్ను వీధిలో అమ్మితే పదివేల దీనారాలు ధర పలికింది. ఎవరు చూశారు, నాకివాళ ఇంకా ఎక్కువ ధర రావచ్చు. అందుచేత మీరేమీ విచారించక నన్ను బజారులో విక్రయించి సొమ్ము రాబట్టండి!" అని సలహా ఇచ్చింది.

"ప్రియసఖి, నిన్ను ఎలా అమ్మేది? నువు లేకుండా ఒక్క గంటసేపుకూడా జీవించలేను!" అన్నాడు అలీనూర్.

"మిమ్మల్ని వదిలి ఇంకొక యజమాని దగ్గిరికి వెళ్లటం నాకుమాత్రం ఇష్టమా? కాని అవసరం బలవత్తరమైనది. అది మన చేత ఎలాటి పనిఅయినా చేయిస్తుంది. మీరు ప్రస్తుతం ఉన్న చిక్కునుంచి బయటపడా లంటే ఇదే మార్గం!" అన్నది ప్రియసఖి.

ఆమె ఎంతోసేపు బోధించిన మీదట అతను మనసు రాయిచేసుకుని బజారుకు



వెళ్ళి, బానిసలను వేలంవేసేవారిలో గట్టి వాణ్ణి ఒకణ్ణి పట్టుకుని వాడితో తన అవసరం గురించి చెప్పాడు.

"బాబూ, తమరి సేవకుణ్ణి. నావల్ల మీకు కావలసిన సహాయం యావత్తూ చెయ్యగలను!" అన్నాడు వేలం వేసేవాడు.

అలీనూర్ వాడికి ప్రియసఖిని చూపించగానే వాడామెను గుర్తించి, "అల్లా సాక్షిగా నేనీమెను అదివరలో ఒకసారి అమ్మాను!" అన్నాడు. ఆమెకు ఎంత హెచ్చు ధర రాబట్టటానికి వీలుంటుందో అంతా రాబట్ట ప్రయత్నిస్తానని అలీనూర్‌కు మాటయిచ్చి, వాడు నలుగురినీ కేకవేసుకు వచ్చాడు.

కొద్దిసేపటికల్లా ఒక గుంపు పోగయింది. ప్రియసఖిని పాటకుపెట్టి, "ధనికుల్లారా, వర్తకశ్రేష్ఠులారా! ఈ అపూర్వ సౌందర్యవతికి ఎంత ధర ఇస్తారో చెప్పి పాడండి!" అన్నాడు వేలం వేసేవాడు.

ఎవరో నాలుగువేల దీనారాలు పాడారు. తరవాత ఇంకొకరు మరో అయిదువందలు పెంచారు.

సరిగా ఆ సమయానికల్లా వజీరు సావి తన గుర్రంమీద అటుగా పోతూ ఆగాడు. ఎవరో బానిసను అమ్ముతున్నట్టు ఆయనకు అర్థమయింది. కొంచెం ఎడంగా వున్న అలీనూర్‌ను చూడగానే, "ఈ దౌర్భాగ్యుడు ఇక





అమ్మదేమీ లేక తన బానిసను అమ్ముకుంటున్నట్టున్నాడు!" అనుకున్నాడు వజీరు. తరవాత ఆయన ప్రియసఖిని చూసి, అందాన్నిబట్టి ఆమె అలీనూర్ పెళ్ళాడిన బానిస అయివుండాలని కూడా తెలుసుకున్నాడు. ప్రియసఖిని చూడలేదుగాని, ఆమె అందాన్ని ప్రతివాళ్ళూ తెగపొగడటం సావీ విన్నాడు. ఇంత అందగత్తె చౌకలో అమ్ముడవుతున్న సంగతి తెలిసి ఆయనకు ఆశ పుట్టింది.

వెంటనే వజీరు సావీ వేలం వేసేవాణ్ణి పిలిచి, "ఇదుగో, ఆ బానిసను నేను కొంటాను. పాట ఎంతవరకు వచ్చిందో అంత మొత్తానికి నాకే కొట్టేయించు," అన్నాడు అధికారం కనబరుస్తూ.

వేలంవేసేవాడు ఏమీ అనలేకపోయాడు. సావీ చూడబోతే మహామంత్రి, ఆయన కెదురుగా ఏ వర్తకుడూ వేలంపాట పాడటానికి సాహసించడు. అందుచేత వేలంవేసేవాడు వజీరుతో, "చిత్తం, తమ క్రయం ఇప్పుడే ఖాయంచేస్తాను!" అంటూ, అలీనూర్‌వద్దకు వచ్చి, రహస్యంగా, "బాబూ, ఇవాళ మీ అదృష్టం ఏమీ బాగులేదు. ఈ దుర్మార్గుడు పాట పెరగనివ్వడు సరిగదా, ఆ ఇస్తానన్న నాలుగువేల అయిదువందలు కూడా ఇవ్వడు. మీ ప్రాణం విసిగినదాకా తిప్పిస్తాడు!" అన్నాడు.

అలీనూర్‌కు పట్టరాని ఆగ్రహం వచ్చింది. "ఏదైనా ఉపాయం వుంటే చెప్పు!" అన్నాడతను వేలంవేసే వాడితో.

"ఒకటే ఉపాయం! మీ బానిసను శిక్షించటానికిగాను బజారులో నిలబెట్టి వేలంపాడించినట్టు నటించండి. ఆమెను అమ్మే ఉద్దేశంలేదని వజీరుగారితో చెప్పి మీ బానిసను మీరు పట్టుకుపొండి!" అని వేలంవేసేవాడు అలీనూర్‌తో చెప్పి, ప్రియసఖిని వెంటబెట్టుకుపోయి వజీరుకు వప్పగించి, తరవాత వజీరుతో, "అయ్యా, ఈ బానిస



యజమాని వస్తున్నాడు. అతనితో మిగిలిన విషయాలు పరిష్కరించుకోండి!" అన్నాడు.

ఇంతలో అలీనూర్ వచ్చాడు. అతను ప్రియసఖి చెంపమీద చెళ్ళున ఒక దెబ్బ వేసి, "బానిసదానా! ఇప్పటికైనా బుద్ధి వచ్చిందా? ఇక ఇంటికి పద! మరొకసారి నేను చెప్పినట్టు వినకపోయావో, నిన్ను నిజంగానే అమ్మేస్తాను!" అని అరిచాడు.

వజీరు నిర్ఘాంతపోయి, "ఏమిటిది? నేను దీన్ని కొన్నాను! ఇది నాది!" అన్నాడు.

"నేను అమ్మందే నువ్వెలా కొన్నావు? పదపద!" అన్నాడు అలీనూర్.

"మీరంతా న్యాయం చెప్పండి! ఈ బానిస నాది! అవునా, కాదా?" అంటూ వజీరు ప్రియసఖి చెయ్యి పట్టుకున్నాడు.

చుట్టూ ఉన్నవారంతా తన అధికారానికి వెరిచి తనను బలపరుస్తారని వజీరు నమ్మకం. అయితే వారికి అలీనూర్‌పైన ఆదరం హెచ్చు. అందుచేత ఎవరూ వజీరును బలపరచలేదు. ఈ సంగతి గ్రహించి అలీనూర్ వజీరు డొక్కలో గట్టిగా పొడుస్తూ, "కుక్కా! పశువా! నాసొత్తు అపహరిస్తావురా? పో, దిక్కున్నచోట చెప్పుకో!" అని అంతగొప్ప వజీరునూ చావ చితక తన్ని, ప్రియసఖిని వెంటబెట్టుకుని నేరుగా ఇంటికి వెళ్ళిపోయాడు. వజీరు వెంటఉన్న బానిసలు కత్తులు దూసి అలీనూర్‌ను వెంబడించ యత్నించారు గాని, అక్కడ చేరిన జనం అడ్డుకుని, వారి ప్రయత్నాలను పూర్తిగా భంగపరిచేశారు.

ముక్కువెంట రక్తం కారుతూ దుమ్ములో పడిపోయిన వజీరు సావి లేచి, తనకు జరిగిన అత్యాచారాన్ని గురించి సుల్తానుగారితో చెప్పటానికి బయలుదేరాడు. వెనకనుంచి జనం ఆయనను చూసి విరగబడి నవ్వుకున్నారు.

ఇంతకాలానికి ఆ దుర్మార్గుడికి తగిన శిక్ష చేసిన అలీనూర్ మీద వారందరికీ గౌరవం పెరిగింది. (ఇంకా వుంది)





# అలీనూర్

[గత సంచిక తరువాయి]

సుల్తాను ఒక క్షణంపాటు తన వజీరును గుర్తించలేకపోయాడు. తరవాత ఆయన, "నిన్నిలా చేసిన దెవరు?" అని ఆశ్చర్యంతో అడిగాడు.

"మహారాజా, మంచి వంటమనిషిని కొందామని బజారుకు వెళ్లాను. అక్కడ ఒక బహు సౌందర్యవతి అయిన బానిస అమ్మకానికి వచ్చింది. మన అల్‌ఫదల్ కొడుకు అలీనూర్ ఆమెను అమ్ముతున్నట్టు తెలిసింది. తమరు ఒకప్పుడు మంచి బానిసను పదివేల దీనారాలకు కొనమని అల్‌ఫదల్‌ను అడిగిఉన్నారు. ఆ బానిస ఇదే నట. దానిని అల్‌ఫదల్ తమకు సమర్పించక తన కొడుకుకు కానుకగా ఇచ్చుకున్నాడు. వాడు ఇటీవల ఒళ్లుపై తెలియకుండా ఉన్నదంతా తగలేసి బికారి అయినాడు లెండి. అందుచేత ఈ బానిసదాన్ని అమ్మకానికి పెట్టాడు. బేరం చవుకలో నాలుగువేల దీనారాలకు పోతున్నదని తెలిసి, తమకు సమర్పించుకుందామనే ఉద్దేశంతో ఆ బానిసను కొనేశాను. అప్పుడు వాడేం చేశాడో చిత్తగించారా? ఏ కిరస్తానీలకో యూదులకో అమ్ముతాను గాని నీకైతే అమ్మను పొమ్మన్నాడు! అప్పటికీ నేను మంచిగా, 'నాయనా, దీన్ని నాకోసం కొనటం లేదురా! మన సుల్తానువారి కోసం కొంటున్నానురా!' అని చెప్పా. ఆ మాటకు వాడు మరింత మండి పడి, నన్ను గుర్రంమీద నుంచి కింద పడేసి, అంతమందీ చూస్తూండగా, చేతులా కాళ్లా తన్నాడు! ఏం సాహసం! ఏం పొగరు!" అన్నాడు వజీరు.

సుల్తాను ముఖం ఆగ్రహంతో జేవురించింది. ఆయన తన భటులను పిలిచి, "మీరు నలభైమంది వెళ్ళి, అల్‌ఫదల్ ఇంటిని పూర్తిగా ధ్వంసంచేసి, నీచుడైన అలీ

ఎస్. ధర్మారావు



నూర్‌నూ, వాడి బానిసనూ పెడరెక్కలు విరిచికట్టి తీసుకురండి," అని ఆజ్ఞాపించాడు.

అదృష్టవశాత్తూ ఆ సమయాన రాజుగారి భవన రక్షకులలో ఒకడు ఒకప్పుడు అల్ ఫదల్ కింద కొలువుచేసినవాడు వున్నాడు. అతను అలీనూర్ ఈడువాడే. ఇద్దరూ కలిసి పెరిగారు. అందుచేత అతను రాజాజ్ఞ వింటూనే బయటికి జారుకుని, అడ్డదార్లవెంట పరిగెత్తి అలీనూర్ ఉంటున్న ఇల్లు చేరుకుని, "బాబూ, తమరు వెంటనే ఇల్లు వదిలి ఎక్కడైనా పారిపోవాలి. లేకపోతే మాన ప్రాణాలు దక్కవు," అని జరిగిన సంగతి చెప్పేశాడు.

అలీనూర్ ప్రియసఖిని ప్రయాణానికి సిద్ధంచేశాడు. రాజభవనపాలకుడు అలీనూర్ చేతిలో నలభై దీనారాలు పెడుతూ, "నా దగ్గిర ఇంతకంటె లేదు, బాబూ. ఈ సొమ్ము తీసుకుని మీరిద్దరూ ప్రాణాలు దక్కించుకోండి," అన్నాడు.

అలీనూర్, ప్రియసఖీ దొడ్డిదారిన ఇంటి నుంచి బయటికి వచ్చి, సందులవెంటా గొందులవెంటా పడి సముద్రతీరపు రేవు చేరుకున్నారు. అదృష్టవశాత్తూ ఒక పడవ లంగరెత్తి బాగ్దాదునగరానికి బయలుదేర బోతున్నది. "ప్రయాణీకులందరూ ఎక్కాలి! వ్యవధిలేదు!" అని సరంగు కేక వేస్తున్నాడు. ఏమాత్రమూ సంకోచించకుండా ఇద్దరూ ఆ పడవలో ఎక్కారు. లంగరు ఎత్తి పడవ బాగ్దాదుకు బయలుదేరింది.

అలీనూర్ ఇల్లువిడిచిన కొద్దిసేపటికల్లా సుల్తాను పంపిన సలభైమంది భటులు అతని ఇంటిపైబడి కనబడినదల్లా ధ్వంసం చేసి చూస్తుండగానే ఇంటిని నేలమట్టం చేసేశారు. అయితే వారికి అలీనూర్ జాడ గాని, అతని బానిస జాడగాని తెలియలేదు.

ఈ సంగతి తెలిసి సుల్తాను బస్రానగరమంతా అలీనూర్ కోసం వెతికించాడు. ఆయన వజీరుసావీని పిలిచి, "నీకు

విచారం వద్దు. నీకు జరిగిన అపచారానికి నేను తప్పక ప్రతిక్రియ చేసితీరుతాను," అని మాట ఇచ్చాడు.

వజీరుసాహి సుల్తానుగారిని పుత్రపౌత్రాభివృద్ధిగా దీవించి, అలీనూర్ కోసం నగరమంతటా చాటింపు వేయించాడు. అలీనూర్‌ను పట్టి ఇచ్చినవారికి వెయ్యి దీనారాలు బహుమానం; అతన్ని దాచినవారికి శిరచ్ఛేదం!

అయితే ఇన్ని ప్రయత్నాలూ విఫలమయాయి. అలీనూర్ జాడ ఎవరూ చెప్పలేకపోయారు.

కొంతకాలానికి అలీనూర్ ఎక్కిన పడవ బాగ్దాదునగరం చేరింది. పడవసరంగు అలీనూర్‌తో, "అయ్యా, ఇదే బాగ్దాదు మహానగరం! భూలోకస్వర్గం! ఇక్కడే మీరు దిగవలిసింది!" అన్నాడు.

పడవ కేవుకుగాను అయిదు దీనారాలిచ్చి అలీనూర్ ప్రియసఖితోకూడా పడవ దిగాడు. దైవవశాన వారు బాగ్దాదునగరానికి రహదారిన వెళ్ళక మరొక దారి పట్టుకున్నారు. ఆదారి వారిని బాగ్దాదునగరం వెలపల ఉండే ఉద్యానవనాల మధ్యకు తీసుకుపోయింది. వారు ఒక ఉద్యానవనం వద్దకు చేరుకున్నారు.



అది ఖలీఫాగారి ఉద్యానవనం. దాని చుట్టూ ఎత్తయిన ప్రహరీగోడ వున్నది. ముఖద్వారానికి పైగా రంగురంగుల దీపాలున్నాయి. ద్వారం వెలపల ఎవరైనా కూర్చోవటానికి బల్లలున్నాయి. ద్వారం మూసివున్నది. దానిపక్కనే జలయంత్రం ఒకటి వున్నది.

"ఇది చాలా అందమైనచోటు. ఇక్కడ బల్లలమీద కాస్సేపు విశ్రాంతి తీసుకుందాం," అన్నాడు అలీనూర్ ప్రియసఖితో. వారిద్దరూ జలయంత్రంవద్ద కాళ్ళూ, చేతులూ, ముఖాలూ కడుక్కుని కొయ్యబల్లలమీద నడుమువాల్చారు. చల్లని పిల్లగాలి వారిని

జోకొట్టింది. వారు తమ బట్టల చెరగులు ముఖానకప్పుకుని నిద్రపోయారు.

వీరిద్దరూ చేరిన ఉద్యానంపేరు ఆనందోద్యానం. దీనిమధ్య ఒక మహలున్నది, దాని పేరు చిత్రమహలు. ఖలీఫాకు మనసు చికాకుగా వున్నప్పుడు ఆయన ఇక్కడికి వచ్చి తన చికాకులన్నీ మరిచిపోతాడు. ఉద్యానం మధ్యవున్న మహలంతా ఒకటే గది. ఆ గదికి నలభై అయిదు కిటికీలున్నాయి. ఒక్కొక్క కిటికీలోనూ ఒక్కొక్క దీపం వేలాడుతూ వుంటుంది. మహలు మధ్యలో బంగారంతో చేసిన పెద్ద దీపం వున్నది. ఖలీఫా వచ్చినప్పుడు మాత్రమే ఈ మహలు తెరిచి, కిటికీలు తెరిచి, దీపాలు వెలిగిస్తారు; మహలు మధ్య ఒక ఆసనం ఏర్పాటు చేస్తారు, దానిమీద సుఖాసీనుడై ఖలీఫా నృత్యగాన వినోదాలు చూస్తాడు. ముఖ్యంగా ఖలీఫాగారి ఆస్థానగాయకుడు ఇసాక్ తన అద్భుతమైన పాటలతో ఖలీఫా విచారాలన్నిటినీ పోగొడతాడు.

ఈ తోటనూ, మహలునూ కనిపెట్టి వుండటానికి ఖలీఫాగారు ఇబ్రాహిం అనే ఒక వృద్ధుణ్ణి ఏర్పాటుచేశాడు. దారేపోయేవాళ్లు తోటలో ప్రవేశించకుండానూ, పూలు దొంగిలించటానికి స్త్రీలూ, పళ్ళకోసం పిల్లలూ రాకుండానూ ఇబ్రాహిం కాపలావుండేవాడు.



ఆరోజు సాయంకాలం అతను తన అలవాటుచొప్పున తోట అంతా చుట్టివస్తూ ద్వారం సమీపంలోగల బల్లలపైన ఇద్దరు వ్యక్తులు పడుకుని వుండటం చూశాడు.

"ఏమి వీళ్ళసాహసం! ఖలీఫాగారు నన్నిక్కడ వేడుకకు వుంచారని వీళ్ల వుద్దేశమా ? ఖలీఫాగారి పరివారం కోసం ఏర్పాటయిన బల్లలపైన నిర్భయంగా పడుకుంటారా ?" అనుకుని ఒక బరికె తీసుకుని వారివద్దకు వచ్చాడు. కాని అంతలోనే అతన్ని అంతరాత్మ మందలించింది. "ఇదేం పని, ఇబ్రాహీం ? వారెవరోకూడా నీకుతెలిదే! అల్లా పంపిన అతిథులుకావచ్చు, దిక్కులేని ముష్టివాళ్ళుకావచ్చు!" అనుకుంటూ ఆ ముసలివాడు వారిద్దరి ముఖాలమీదా కప్పి వున్న బట్టలు తొలగించి, వారి అందంచూసి నివ్వెరపోయాడు.

అతని కోపం పశ్చాత్తాపంగా మారింది. అతను అలీనూర్ కాళ్ళదగ్గిర కూచుని కాళ్ళు పత్తసాగాడు. ఈ స్పర్శకు అలీనూర్ మేలుకుని చివాలున లేచి కూచున్నాడు. తనకు కాళ్ళు పట్టుతున్నవాడు వృద్ధుడని తెలుసుకుని, ఇబ్రాహీం చెయ్యి తీసుకుని తన కళ్లకు అద్దుకున్నాడు.

"మీరిద్దరూ ఎక్కడివాళ్ళు, నాయనా ?" అని అడిగాడు తోటమాలి.





"పరదేశులం!" అన్నాడు అలీనూర్.

"అతిథులను ఆదరించమని అల్లా నిర్దేశం. నా తోటా, మహలూ చూతురుగాని రండి!" అన్నాడు తోటమాలి ఇబ్రాహిం.

"ఇదంతా తమ సొత్తేనా?" అన్నాడు అలీనూర్ ఆశ్చర్యంగా.

ఖలీఫా పేరు చెబితే కుర్రవాడు బెదిరి పోతాడేమోనని ఇబ్రాహిం, "అవును, నాయనా! అంతా నాదే!" అన్నాడు.

ప్రియసఖికూడా లేచింది. ఇద్దరూ తోట మాలి వెంట లోపలికి వెళ్ళారు. అలీనూర్ బస్రాలో ఎంతో గొప్ప ఉద్యానాలు చూశాడు, కాని ఇంత అందమైన ఉద్యానం ఉంటుం దని అతను కలలోకూడా అనుకోలేదు. ద్వారందాటి లోపలికి వెళ్ళే దారిపొడుగునా నగిషీ చేసిన కొయ్యలతో అర్చీలున్నాయి. వాటికి ద్రాక్షతీగెలు పాకి, వాటిన పళ్లగుత్తులు ఎర్రగా, నల్లగా వేళ్ళాడుతున్నాయి. దారికి రెండు వేపులా ఎత్తయిన ఫలవృక్షా లున్నాయి. వాటిపైన రకరకాల పక్షులు చేరి పాడుతున్నాయి. ఇక ఆ తోటలో పూల చెట్లుగురించి చెప్పనే అక్కర్లేదు. అక్కడ పూయని పూవు లేదు.

ఇబ్రాహిం తన అతిథులకు తోట చూపించి వారిని మహలులోకి తీసుకు పోయాడు. లోపలికి అడుగు పెట్టగానే వారిద్దరికి కళ్ళు చెదిరిపోయాయి. ప్రపం చంలో అంత అందంగా అమర్చిన మహలు ఉండదనిపించింది. వారు దానిని చూడ టానికి చాలాకాలం పట్టింది. చివరకు అలీ నూర్ ఒక కిటికీ వద్దకు వెళ్లి బయట వున్న తోటను చూశాడు. బయట నిండు వెన్నెల కాస్తున్నది. అతను ఆ క్షణంలో తన కష్టా లన్నీ మరిచిపోయాడు.

ఇబ్రాహిం వారికి ఆహారం తెచ్చిపెట్టాడు. అలీనూర్ అతనితో, "ఇబ్రాహిం, ఆహారంతో బాటు పానీయాలుకూడా ఇవ్వటం ఆచారం గదా! పానీయాలేవి?" అని అడిగాడు.

ఇబ్రాహిం వెళ్ళి ఒక లోటాతో మంచినీరు పట్టుకువచ్చాడు. అలీనూర్ నవ్వి, "నేనడిగిన పానీయం ఇది కాదు," అన్నాడు.

"నీకు ద్రాక్ష సారాయం కావాలిలాగుంది. నేను పదమూడేళ్ళక్రితం మక్కాకు వెళ్లి అక్కడ తాగుడు వదిలేశాను. మీకు కావలిస్తే ఇస్తాను," అంటూ ఇబ్రాహిం ద్రాక్ష సారాయం తెచ్చాడు. కాని తన అతిథులు తాగుతూఉండటం చూసి అతనికి ఊరుకో బుద్ధిపుట్టలేదు. అతనుకూడా వారితోబాటు తాగనారంభించాడు.

"దీపాలు లేకపోతే బాగాలేదు, వెలిగించమంటావా?" అన్నది ప్రియసఖి ఇబ్రాహింతో. తాగటంవల్ల ఒళ్ళు తెలిసీ తెలియకుండా ఉన్న తోటమాలి ఒక్కదీపం వెలిగించటానికి అనుమతి ఇచ్చాడు. కాని అలీనూర్ లేచి వెళ్ళి మహలులో ఉన్న కిటికీలన్నీ తెరిచి దీపాలన్నీ వెలిగించాడు.

సరిగా ఈ సమయానికి ఖలీఫా తన భవనంలో కిటికీ వద్ద నిలబడి ఉండటం జరిగింది. ఆయన చూపునది మీదుగా ఆనందోద్యానంవేపు తిరిగేసరికి దేదీప్యమైన కాంతి కంటబడింది. ఆయన వెంటనే తన వజీరైన జాఫర్‌ను పిలిచి, "అసమర్థుడా, ఈ నగరంలో ఏం జరిగేదీ తెలుసుకోవా? బాగ్దాదును శత్రువులు కొల్లగొట్టుకుపోయినా నీకు



తెలియదులాగుందే? చూడు, చిత్రమహలులో దీపాలు ఎలా వెలుగుతున్నాయో! నేను ఖలీఫాగా ఉండగా ఇది ఎలా జరిగింది?" అన్నాడు.

వజీరు జాఫర్ వెలుగు చూశాడు. ఏమనాలో అయినకు తోచక, "హుజూర్, కిందటి వారం ఇబ్రాహీం నాదగ్గిరికి వచ్చి తన మనవడికి చిత్రమహలులో ఉపాకర్మ చేయించుకోవటానికి అనుమతి వేడాడు. నేను తమవద్దనుంచి అనుమతి పొందుదామనుకుని అలాగే లెమ్మన్నాను. తరవాత ఆ విషయమే పూర్తిగా మరిచిపోయాను!" అని బొంకాడు.

"అది రెండో తప్పు. మనం ఏదన్నా కానుకలు పంపిస్తామనే ఆశతోనే ముసలి ఇబ్రాహిం తన మనవడి ఉపాకర్మ గురించి ఎత్తి ఉంటాడు. నువ్వేమి కానుక ఇవ్వకపోగా నేను ఇచ్చే అవకాశంకూడా లేకుండా చేశావు!" అన్నాడు ఖలీఫా.

"ఏలినవాడు నా తప్పులు క్షమించాలి," అన్నాడు జాఫర్.

"క్షమించాం. కాని ఈ రాత్రి ఇబ్రాహింతో గడపడానికి నిశ్చయించాను. వాడు చాలా యోగ్యుడు, దైవచింత గలవాడు. ఈ సమయానికి వాడు తత్వజ్ఞానుల నందరినీ చేర్చి మంచిమాటలు చెవిని వేసుకుంటూ ఉంటాడు. మనం అక్కడికి వెళదాం. మనం రావటంచూసి ముసలివాడు చాలా సంతోషిస్తాడు," అన్నాడు ఖలీఫా.

జాఫర్కు గుండె జారిపోయింది. చాలా పొద్దుపోయిందనీ, ఈ పాటికి ఉపాకర్మ పూర్తి అయి అందరూ ఎవరిదారిన వారు వెళ్ళిపోతూ ఉంటారనీ ఆయన ఖలీఫాకు చెప్పచూశాడు. కాని ఖలీఫా వెళ్లి తీరాలన్నాడు. ఆయనా, జాఫర్, దండనాయకుడు మస్రూర్, ఈ ముగ్గురూ వర్తకుల వేషాలు వేసుకుని బయలుదేరారు.

[ముగింపు వచ్చే సంచికలో]





# అలీ నూర్

(గత సంచిక తరువాయి)

ఆసంపేద్యానం చేసేసరికి తోటద్వారం తెరిచి ఉండటం చూసి ఖలీఫా ఆశ్చర్యపోయాడు. ఇబ్రాహీం ఎన్నడూ అంత అజాగ్రత్తగా ఉండడు. మహలును సమీపించగానే ఖలీఫా ఆశ్చర్యం ఇంకా ఎక్కువయింది. లోపల ప్రార్థనలు మొదలైనవి జరుగుతున్న ఆలికిడి ఏమీ లేదు.

"లోపల ఏమి జరుగుతున్నదీ రహస్యంగా చూస్తాను," అంటూ ఖలీఫా జాఫర్ సహాయంతో ఒక చెట్టు ఎక్కి, కిటికీలోకి చూశాడు. లోపల ఒక అందమైన యువతీ, యువకుడూ ఉన్నారు. ఇబ్రాహీం చేతిలో సారాయంలోటా పెట్టుకుని, "అమ్మాయీ, నువ్వు ఒక్క పాట పాడితేగాని మన ఆనందం పూర్తికాదు!" అంటున్నాడు.

ప్రియసఖికి ప్రోత్సాహం కలగడానికిగాను ముసలివాడు స్వయంగా ఒకపాట పాడాడు, అది చూసి ఖలీఫాకు చాలా కోపం వచ్చింది. ఆయన గబగబా చెట్టు దిగివచ్చి, "తోటమాలి మనవడి ఉపాకర్మ ఎంత శాస్త్రోక్తంగా జరుగుతున్నదో సుస్పష్టంగా చూసి తరించు!" అని జాఫర్‌తో అన్నాడు.

జాఫర్ చెట్టెక్కి లోపల వినోదం జరుపుకుంటున్న ముగ్గురినీ చూశాడు. ఆయన చెట్టుదిగివచ్చి మాటా పలుకూ లేకుండా ఖలీఫా కాళ్ళమీద పడ్డాడు.

"ఏడుస్తా వెందుకు, జాఫర్? నేను నిన్ను క్షమించానులే. ఇంకా ఏం జరుగుతుందో చూదాం, చెట్టెక్కు!" అన్నాడు ఖలీఫా నవ్వుతూ.

ఈలోపుగా తోటమాలి ప్రియసఖికోసం ఒక సితార్ తెచ్చాడు. దానిమీద వాయిస్తూ ఆమె ఒక పాట పాడింది. ఆమె కంఠం చాలా శ్రావ్యంగా ఉన్నది. ఖలీఫా ఆనందంతో జాఫర్‌కేసి తిరిగి, "జాఫర్, నేను

ఎస్. ధర్మారావు





అంత కోమలమైన కంఠం ఎన్నడూ వినలేదు!" అన్నాడు.

"అయితే ఏలినవారికి కోపం పోయి పట్టేనా?" అని అడిగాడు జాఫర్. అవునన్నాడు ఖలీఫా. ఇద్దరూ చెట్టు దిగి వచ్చారు. తరవాత ఖలీఫా, "నేనిప్పుడు లోపలికి వెళ్ళి, వారిద్దరూ ఎవరో తెలుసుకోవాలి," అన్నాడు.

"ఉన్నపాళంగా తమరు లోపలికివెళితే వాళ్లు ముగ్గురూ కంగారుపడిపోతారు. వేషం మార్చాలి," అన్నాడు జాఫర్.

ఆ సమయాన కొలను దగ్గిర ఏదో అలికిడి అయింది. ఈ కొలనులోకి టైగ్రిస్‌నది నుంచి నీరు వస్తుంది. దానితోబాటు చేపలు కూడా వస్తాయి. వాటి కిక్కడ ఇబ్రాహీం రోజూ ఆహారం వేస్తాడు. వాటిని పట్టేవారుండరు. అందుచేత ఈ కొలనులో చేపలు గుప్పలు తెప్పలుగా ఉంటాయి. నదిలో చేపలు దొరకని బెస్తవాళ్లు తోటమాలి కన్ను గప్పి అప్పుడప్పుడూ ఈ తోటలో ప్రవేశించి, చేపలు పట్టటం జరుగుతూంటుంది.

ఈ రాత్రి కరీం అనే బెస్తవాడు, వాకిలి తెరిచిఉండటం చూసి కొలనులో చేపలు పట్టవచ్చి ఖలీఫాకు దొరికిపోయాడు. ఖలీఫా వాణ్ణి గుర్తించి, "దొంగముండాకొడకా, కరీం! నువ్వు చేస్తున్న పనేమిటి!" అన్నాడు.

కరీం ఖలీఫాను గుర్తించి భయపడుతూ, "ఏలినవారు క్షమించాలి! పొట్ట జరగక గడ్డి కరిచాను! పేదవాణ్ణి!" అన్నాడు.

ఖలీఫా నవ్వి, "పరవాలేదులే. వల వెయ్యి, నీ అదృష్టం చూస్తాను," అన్నాడు. కరీం వల వేసి చాలా చేపలు పైకి లాగాడు.

"నీ అదృష్టం బాగున్నదిరా! నీ బట్టలు విప్పి నాకిచ్చెయ్యి," అన్నాడు ఖలీఫా.

కరీం మారు మాటాడకుండా వాటిని విప్పి ఖలీఫాకిచ్చాడు. ఖలీఫా ఆ బట్టలు తొడుక్కుని కొన్ని చేపలు బుట్టలో వేసుకుని మహలు తలుపు తట్టాడు.





తోటమాలి తలుపు తెరిచి, ఖలీఫాను గుర్తించక, "ఓహో, కరీం? ఏం పనిమీద వచ్చావు?" అన్నాడు.

"మీకు అతిథులున్నారని తెలిసి చేపలు పట్టి తెచ్చాను," అన్నాడు ఖలీఫా.

ప్రియనవలి లేచివచ్చి, చేపలను చూసి సంతోషంగా, "వాటిని వేయించి పట్టుకు రావేయ్!" అన్నది.

ఖలీఫా నరేనని బయటికి వచ్చి జరిగిన విషయం జాఫర్‌తో చెప్పి, ఇబ్రాహీం ఉండే గుడిసెకు వెళ్ళి, నిప్పుచేసి తానే స్వయంగా చేపలను కోసి వేయించాడు. ఆయన వేయించి తెచ్చిన చేపలను తోటమాలీ, అలీ నూర్, ప్రియనవలి తినేశారు.

తరవాత అలీనూర్ ఖలీఫా చేతిలో మూడు దీనారాలు పెడుతూ, "నువ్వు చేసిన ఉపకారానికి ఇదుగో ప్రతిఫలం. ఒకప్పుడైతే నీ దారిద్ర్యాన్ని పోగొట్టగలిగిఉండే వాణ్ణి. కాని ఇప్పుడు ఆకష్టంలో కావటంచేత అంతే ఇవ్వగలుగుతున్నాను," అన్నాడు.

ఖలీఫా ఆ దీనారాలను కళ్ళకద్దుకుని బుట్టలో వేసుకుంటూ, "మీరిచ్చినదానికన్న కూడా నాకీ యమ్మ పాట వినాలని ఉంది. నేను పాట అంటే చెవి కోసుకుంటాను," అన్నాడు. అలీనూర్ అనుమతితో ప్రియనవలి



మరొకపాట పాడింది. ఖలీఫా ఆనందంతో, "అద్భుతం! అద్భుతం! అద్భుతం!" అని కేకలు పెట్టాడు.

అది చూసి అలీనూర్, "బెస్తవాడా, నీకు ఈమె నచ్చినట్టున్నది. ఈమెను నువ్వే తీసుకో!" అంటూ లేచి వెళ్ళిపోసాగాడు.

ప్రియనవలి కళ్ళవెంట నీరు కారుస్తూ, "నన్ను వదిలేసి ఎక్కడికి పోతున్నావు, అలీనూర్?" అని అడిగింది.

ఇదంతా చూసి ఖలీఫాకు ఆశ్చర్యంతో పాటు బాధకూడా కలిగింది. ఆయన అలీనూర్‌తో, "అబ్బాయీ, నువ్వీ బానిసను ఎవరివద్దనుండిగాని ఎత్తుకురాలేదుగదా?"



అన్నాడు. అలీనూర్ ఆయనకు తన కథ యావత్తూ చెప్పాడు. అంతా విని ఖలీఫా, "అయితే ఇప్పుడేం చెయ్యబోతున్నావు?" అని అడిగాడు.

"అల్లా సృష్టించిన ప్రపంచం చాలా విశాలమైనది. అందులో అనేక శహరాలు ఉన్నాయి!" అన్నాడు అలీనూర్.

"నేను ఒక పేద బెస్తవాణ్ణి గనక నీకు సహాయం చెయ్యలేననుకోకు. నేను చెప్పినట్టు చేస్తివా నీ కష్టాలు గట్టెక్కుతాయి," అంటూ ఖలీఫా తోటమాలిచేత కాగితం తెప్పించి దానిమీద బస్రా సుల్తానుకు ఈ విధంగా లేఖ రాశాడు:

"బస్రా సుల్తాను సులేమానుకు ఖలీఫా హారూన్ అల్ రషీద్ వ్రాయునది ఏమనగా, ఈ లేఖ తెచ్చేయువకుడు వజీర్ అల్ ఫదల్ కుమారుడైన అలీనూర్. ఈ లేఖ చూడగానే నీవు గద్దె దిగి అలీనూర్‌ను నీ స్థానంలో సుల్తానుగా నియమించవలెను. ఆలస్యము చేయవద్దు."

ఈ లేఖపైన తన ముద్రవేసి ఖలీఫా ఆ ఉత్తరాన్ని అలీనూర్‌కిస్తూ, "దీన్ని తీసుకుపోయి బస్రాలో ఉండే సుల్తానుకియ్యి. నీ కష్టాలు తీరిపోతాయి," అన్నాడు.

అలీనూర్ అప్పుడే బయలుదేరి వెళ్ళిపోయాడు. ప్రియసఖి ఏడవసాగింది. తోట



మాలి ఖలీఫాకేసి తిరిగి, "పాపిష్ఠివాడా, నువ్వు మాకు ఏం చేశావో! ఈ ఇద్దరికీ ఎడబాటు కలిగించావు! ముష్టిమూడుకాసులు వెయ్యమని చేపలకు మూడుదీనారాలు పుచ్చుకున్నావు గదా. అంతతో తృప్తిపడలేక పోయావా?" అన్నాడు.

ఖలీఫా కళ్ళ వెంట నిప్పులు రాలాయి. ఆయన చప్పట్లు చరిచేసరికి వజీర్ జాఫరూ, మస్రూరూ లోపలికి వచ్చారు. జాఫర్ ఖలీఫా వేసుకున్న దుస్తులు తీసివేసి ఆయన సొంతదుస్తులు వేశాడు. తోటమాలి ఇబ్రాహిం కళ్ళు తిరుగుడు వచ్చాయి, అతని నిషా యావత్తూ దిగిపోయింది. అతను ఖలీఫా కాళ్ళపై పడ్డాడు. ఖలీఫా తోటమాలిని క్షమించి, ప్రియురాలితో, "అమ్మాయీ, నేనెవరో ఇప్పుడు తెలిసింది గనక నీ భర్తవద్ద మంచి కబురు వచ్చేదాకా మా యింట ఉండు!" అన్నాడు.

ప్రియురాలు ఖలీఫావెంట రాజభవనానికి వెళ్ళిపోయింది. అక్కడ ఆమెకొక గదీ, దాసీజనమూ ఏర్పాటు చేయబడ్డారు. ఖలీఫా ఆమెతో, "నీ యువమామిని బస్రాకు సుల్తాను కాబోతున్నాడు. నువ్వు రాణివవుతావు. అందుచేత నిర్విచారంగా ఉండు!" అన్నాడు. ఆమె రాజభవనంలో దాసీల మధ్య సుఖంగా ఉండసాగింది.





కొద్దికాలంలో అలీనూర్ బస్రా చేరుకుని సుల్తాను దర్శనం చేసుకుని, ఆయనకు ఖలీఫా ఇచ్చిన లేఖ అందజేశాడు. సుల్తాను ఖలీఫా ముద్ర చూసి గౌరవంగా లేచి నిలబడి, లేఖను మూడుమార్లు కళ్ళకు అద్దుకుని, విప్పి చదివాడు. తరవాత ఆయన, "ఖలీఫాగారి ఆజ్ఞ శిరోధార్యం!" అన్నాడు.

ఖలీఫా ఆజ్ఞానుసారం తన పదవిని అలీనూర్ పరం చేయటం కోసం సుల్తాను నగరంలోని పలుగురు కాజీలనూ, అమీర్లనూ పిలవనంపాడు. సరిగా ఈ సమయంలో వజీరు సాధి అక్కడికి వచ్చాడు. సుల్తాను ఖలీఫాగారి ఉత్తరాన్ని సాధికి చదవటానికి ఇచ్చాడు. సాధి ఉత్తరం చదివి ఖలీఫా ముద్ర వున్న భాగం చించి అవతల పారేశాడు.

"నీమదా, నీకు మతిపోయిందా? ఎందుకు చేశావిపని?" అని సుల్తాను గద్దించాడు.

"ఈ దుర్మార్గుడు ఖలీఫాగారిని కలుసుకున్నాడని మీరు నమ్మకండి. వీడు టక్కరి, ఈ ఉత్తరాన్ని తానే సృష్టించాడు. ఖలీఫాగారే నిజంగా ఉత్తరం రాయదలిస్తే తన స్వంత కాగితాలపైన లేఖకులచేత రాయించి ఉండేవారు. దానిపైన రాజోద్యోగుల ముద్రలుకూడా ఉండేవి." అన్నాడు సాధి.

"అయితే నన్నిప్పుడేం చెయ్యమంటావు?" అని సుల్తాను అడిగాడు.

"వీణ్ణి నాకు వప్పగించండి. నిజం నేను తెలుసుకుంటాను. నేను వీడివెంట బాగ్దాదుకు మన ఉద్యోగిని ఒకణ్ణి పంపి నమ్మదగిన ఉత్తరం తెప్పిస్తాను. నిజంగా వీడు మనని మోసగించినట్టయితే వీడికి తగిన విధంగా నేనే బుద్ధి చెబుతాను!" అంటూ సాధి చాలాసేపు మాట్లాడిన మీదట, అలీనూర్ దోషి అని సుల్తానుకు నమ్మకం కుదిరిపోయింది. ఆయన అలీనూర్‌ను తన భటులచేత చావగొట్టించి, అతను స్పృహ తప్పి పడిపోయాక ఖైదులో పెట్టించాడు.



జైలు అధికారి పేరు కుత్రైర్. అతను అలీనూర్‌ను జైలులోకి తీసుకుపోయి, ఒక గదిలో పెట్టి, అతని చేతులకూ కాళ్లకూ వేసిన బేడీలు ఊడదీశాడు. ఆ గదిని తానే స్వయంగా శుభ్రంచేసి అక్కడ ఒక కంబళి పరిచాడు. తరవాత అతను అలీనూర్‌తో, "అయ్యా, నేను మీ తండ్రిగారికి చాలా ఋణపడి ఉన్నాను. అందుచేత నావల్ల మీకేమీ హాని జరగదు," అన్నాడు.

అది మొదలు నలభైరోజులపాటు ఈ అధికారి అలీనూర్‌కు వీలయిన సౌకర్యాలన్నీ కలగజేశాడు.

ఖైదీని గురించి రోజూ సావీకి వార్తలు పంపేటప్పుడు అలీనూర్‌ను చిత్రహింసలు చేసినట్టుగా తెలియజేస్తూ వచ్చాడు.

అలీనూర్ జైలు ప్రవేశించిన ముప్పై రోజులకు ఖలీఫా ఒకనాడు ఒక గదిపక్కగా వెళుతూఉండగా లోపల ఎవరో ఏడుస్తున్నట్టు వినిపించింది. ఆ ఏడిచేమనిషి ఎవరని నౌకర్లను అడిగాడు. వారు వెళ్ళి ప్రియసఖిని తెచ్చారు. ఆమెను ఖలీఫా పూర్తిగా మరిచాడు. అందుచేత ప్రియసఖి తన గొడవ చూపెడ్తూ చెప్పుకుని, "అలీనూర్ వెళ్ళి నెల అయింది. ఇంతవరకు అతని వార్త తెలియలేదు," అన్నది.



అప్పుడు ఖలీఫాకు అంతా జ్ఞాపకం వచ్చింది. ఆయన ఒక నౌకరుద్వారా అలీనూర్‌కు ఒక మంచి బహుమానం పంపాడు.

అలీనూర్ జైలులో పడిన నలభైఒకటవ రోజున ఈ బహుమానం జైలు చేరింది. అది ఎవరు పంపినది, ఎవరికి పంపినది సుల్తానుకు అర్థం కాలేదు. సావీని అడిగితే తనకు కూడా తెలియదన్నాడు. కాని ఆ బహుమానం ఒకవేళ ఖలీఫానుంచి అలీనూర్‌కు వచ్చిందేమోనని ఆయనకు అనుమానం తట్టింది. ఈ అనుమానమే నిజమైతే అలీనూర్ బతికిఉండటం తనకు క్షేమంకాదు. అందుచేత సావీ సుల్తానుతో, "ఆ దుర్మా



స్తుడు అలీనూర్ చచ్చిపోవాలని ఉమరు ఆజ్ఞాపించారు కారూ?" అన్నాడు.

"సరిగా జ్ఞాపకం చేశావు. వెంటనే వాడి శిరచ్ఛేదానికి ఉత్తరువియ్యి," అన్నాడు సుల్తాను కోపంగా.

ఈలోపుగా ఖలీఫాకు అలీనూర్ అసలు బతికి ఉన్నాడా లేదా అన్న అనుమానం వచ్చింది. అతను బతికి బాగుంటే ఈపాటికి ఏదో వార్త రావలసిందే. అందుచేత ఆయన జాఫర్‌ను పిలిచి, "నువ్వు కొంత సాయుధ పరివారాన్ని వెంటపెట్టుకుని బస్రా వెళ్లు. అలీనూర్ బస్రాకు సుల్తాను అయిఉంటే సరేసరి, లేక అతనికి ఏదైనా అపాయం జరిగిఉంటే, అపకారం చేసినవారిని బంధించి తీసుకురా! వారి రక్తం కళ్ల జూస్తాను!" అన్నాడు.

అలాగే జాఫర్ కొంత పరివారంతో బస్రాకు ప్రయాణమయాడు.

అక్కడ బస్రాలో అలీనూర్‌ను ఖైదు నుంచి రాజసభకు తీసుకువచ్చారు. అలీనూర్‌ను శిరచ్ఛేదం చెయ్యబోతున్నారన్న వార్త చాటింపు విని జనం తండోపతండాలుగా చూడవచ్చారు. వారందరికీ అలీనూర్‌పైన అభిమానమే.

సావి తన భటులతో, "ఈ దుర్మార్గుణ్ణి గాడిదపై వేసి కట్టండి," అన్నాడు.

"అలీనూర్, ఈ ముసలివాణ్ణి చంపెయ్యటానికి అనుమతి ఇయ్యి!" అని జనంలో నుంచి కేకలు వచ్చాయి.

"మీరు తొందరపడకండి. రాసిపెట్టినది అనుభవించక తప్పేదిలేదు," అని అలీనూర్ వారితో చెప్పాడు.

తరవాత సాది భటులు అలీనూర్‌ను ఒక గాడిదపై వేసి కట్టి వధ్యస్థానానికి తీసుకుపోయారు. శిరచ్ఛేదంచేసేవాడు కత్తి పట్టుకుని సిద్ధంగా ఉన్నాడు. పక్కనే ఉన్న రాజభవనం కిటికీనుంచి సుల్తానుగారు తల బయటపెట్టి చూసి అనుమతి ఇవ్వగానే మరణశిక్ష అమలు జరుగుతుంది. అందుచేత అందరూ ఆ కిటికీకేసి చూడసాగారు. కాని, ఎంతసేపటికీ సుల్తానుగారి తల కిటికీ వద్దకు రాలేదు. చిట్టచివరకు సుల్తానుగారు తల బయటపెట్టారుగాని ఆయన చూపు వధ్యస్థానం కేసి తిరగలేదు. దూరాన గుర్రాలపై వస్తున్న జాఫర్ ఆయన పరివారం సుల్తానుగారి కంటబడింది. అందుచేత ఆయన మళ్ళీ లోపలికి తిరిగి తన భటులతో, "మనకోసం బాగ్దాదునుంచి ఎవరో వస్తున్నట్టున్నది. వారికి తగిన రీతిగా స్వాగతమిచ్చే వాళకు కబురు చెయ్యండి!" అన్నాడు.

అలీనూర్‌కు మరణశిక్ష విధించబడిన వార్త ప్రజల నోటనే జాఫర్‌కు తెలిసింది.



ఆయన నిప్పులు కక్కుతూ సుల్తానును చూడవచ్చి, "అలీనూర్‌కు ఏమాత్రం అపాయం జరిగినా నేరస్థుల తలలు తీసేస్తాను! అలీనూర్ ఎక్కడ?" అని అడిగాడు.

వధ్యస్థానంనుంచి అలీనూర్‌ను సుల్తాను రప్పించాడు. సుల్తానును, సావీని ఖైదు చెయ్యమని ఉత్తరువిచ్చి, అలీనూర్‌ను బస్రాకు సుల్తానుగా జాఫర్ ప్రకటించాడు. ప్రజల ఆనందానికి అంతులేదు.

కొత్తసుల్తాను గౌరవార్థం మూడు రోజుల పాటు విందులూ వినోదాలూ జరిగాయి. నాలుగోనాడు జాఫర్ బాగ్దాదుకు ప్రయాణం కట్టాడు. "నాకు ఖలీఫాగారి దర్శనం చేసుకోవాలని ఉన్నది. నేనుకూడా బాగ్దాదుకు మీవెంట వస్తున్నాను," అన్నాడు అలీనూర్ జాఫర్‌తో. ఇందుకు జాఫర్ సమ్మతించాడు.

వారు బాగ్దాదు చేరగానే జాఫర్ ఖలీఫాతో జరిగినదంతా చెప్పాడు. ఖలీఫా అంతా విని, అలీనూర్‌కేసి తిరిగి, "అలీనూర్, నీకు ద్రోహం చేసిన ఈ సావీ తల నీచేత్తోనే ఖండించు!" అని ఆజ్ఞాపించాడు. అలీనూర్ కత్తిదూసి సావీని సమీపించాడు.

"అలీనూర్, నేను దుర్మార్గ ప్రవృత్తి గలవాణ్ణి. నా ప్రవృత్తికి అనుగుణమైన పనులు చేశాను. నువ్వు మంచివాడివి. అందుచేత నీ ప్రవృత్తికి అనుగుణంగా ప్రవర్తించు!" అన్నాడు సావీ.

ఈ మాట వినగానే అలీనూర్ చేతి నుంచి కత్తి కింద పడిపోయింది. అలీనూర్ సజ్జనత్వాన్ని అందరూ కొనియాడారు. ఖలీఫా సుల్తానునూ, సావీని క్షమించక తప్పిందికాదు.

తరవాత ఖలీఫా అలీనూర్‌ను కొన్నాళ్ళు తనవద్ద ఉంచుకుని చివరకు అంతులేని బహుమానాలతో బస్రాకు పంపేశాడు. అలీనూర్ ప్రియసఖిని వెంటబెట్టుకుని బస్రాకు వెళ్ళి అక్కడ సుల్తానుగా చాలాకాలం పరిపాలించాడు. (అయిపోయింది)

